**14**- బొందితో కైలాసము **20 -02 -25**

బొందితో కైలాసము పోవటానికి భారతీయులు పడి చస్తారని - ఏమి చేయమన్నా చేస్తారని - ఎంత ఖర్చు పెట్టమన్నా పెడతారని - అమెరికాకి చెందిన ఎలెవన్ మాస్క్ తెలుసుకున్నాడు . ఆయన ఇందులో ఎంతో వ్యాపార అవకాశాన్ని చూసాడు . భారతీయు లు దీనిని ఊహిస్తారు కానీ - కళ్ళు మూసుకొని వ్యతిరేకిస్తారని - కూడా గుర్తించాడు .అట్లా చేసి ఎంతో కోల్పోయారని కూడా బల్ల గృద్దాడు .

ముందు గా బొంది అంటే ఏమిటి అయి వుంది? అని అయన గూగులు దాన్ని సోది అడిగాడు . బొంది అంటే దేహము- "దేహము తోటి పైకి పోవటం" అని అర్ధం - అనగా జీవించి ఉండగా భక్తి వ్యక్తి ఒకడు - పల్లకీ లాంటిది ఎక్కి ఆకాశం లోకి పోతాడు . అతడు ఎక్కడకు పోయినా కానీ అతడు కైలాసం పోయినాడనే అంటారు అని గూగీ చెప్పింది . ఈ పాటి విమానాలు వాటి ప్రయాణాలు - ఎలెవన్ మాస్క్ కు కృష్ణుడికి వెన్నతో కలిపిన తిండి వంటిది .

ఇలాంటి వార్తలు ఎన్నో వస్తూ ఉండటం తో ఒకాయన ఉత్సాహంతో ఎలెవన్ మాస్క్ కంపెనీకి మెయిల్ పెట్టాడు . వాళ్ళు తిరిగి సమాధానంచెపుతూ ఇండియాలో మా ఏ ఐ ఇంజినీర్ ప్లస్ అడ్మిన్ వున్నారు . - మీకు . హిందీ లేదా భారతీయ దేశభాషల్లో సమాధానం కావాలంటే "బాబూ శ్రీకాంత్ "అని ఇంగ్లీష్ లో సమాధానం కావాలంటే "డాక్టర్ శ్రీకాంత్ "అని - తెలుగులో సమాధానం కావాలంటే " యంత్ర మంత్ర తంత్ర శ్రీకాంత్" అని టైపు చేసి అడగండి అని చెప్పారు .

అడిగినాయన అయన తెలుగే కావాలని అడిగాడు . తెలుగులో ఇట్లా సమాధానం వచ్చింది . " మీకు మీ ఆఖరి రోజులు అయిపోయాయని నమ్మకం కుదిరి -మాతో అగ్రిమెంట్ చేసుకుంటే - మిమ్మల్ని ఒక పల్లకీలో కూచో పెట్టి దానికి సోలార్ రాకెట్ ఇంజిన్లు ఫిట్ చేస్తాము .
ఆ పల్లకీలో వున్నా సాఫ్ట్ వెర్ మీ కళ్ళ ద్వారా మీ మైండ్ ను చదువు తుంది . చదివి మీరు కైలాసము అంటే ఏ ప్రదేశము అని వూహించుకుంటున్నారో అది ఈ విశ్వంలో ఎక్కడ వున్నదో గుర్తు పట్టి మిమ్మల్ని అక్కడికి తీసుకు పోతుంది . తీసుకు పోయి ఓ పిల్ల పోరగాడు ఫుట్ బాల్ ను తన్నితే అది ఎట్లా పైకి దూసుకు పోతుందో అట్లా గా మీరు

కూచున్న సీటు మిమ్మల్ని పైకి తంతుంది .మా వెహికల్ మాకు వెనక్కి వచ్చేస్తది. పిండి కొద్దీ రోటీ అన్నట్లు మీవూహ కొద్దీ మీరు ఎక్కడ కావలి అంటే అక్కడ కి పోయి పడతారు . కైలాసం అంటే సరైన వూహ లేక పోతే అంతరక్షపు కక్షలో చిక్కుకొని అక్కడే గిరికీలు కొడతారు . ఇప్పటి వరకూ జరిగిన దానిని బట్టి 99 % కైలాసం అని కోరుకొని -పోయి హిమాలయాలలో ని "రూప్ కుండా " లో పడ్డారు . ఇది కాదు అని మీ మత విశ్వాసం కొద్దీ స్వర్గం విదేశాల్లో ఉంటే - మీకు పాస్పోర్ట్ అవసరం "

"కాన్సెప్ట్ నచ్చిందండీ . మాకేపాటి ఖర్చు ఎంతవుతాదో?" అని ఈయన మళ్ళీ అడిగాడు .

"ఇండియా సంగతి మాకు తెలుసు. ముందుగా కోటీశ్వరులు -- స్వామీజీలు దీనికోసం క్యూ కడతారు . పేద ప్రజలకు వారి నుండి పోటీ తప్పించటానికి - అని - తెల్ల రేషన్ కార్డు వుంది 80 దాటినా వాళ్లకు టోటల్ గా ఫ్రీ -ఇది మా సోషల్ సర్వీసులో భాగము " " అని బదులు చెప్పాడు శ్రీకాంత్.

" ఈ "రూప్ కుండా " ఏమిటండి ? ఊకే అడుగుతున్నాను . మేము పోయేటప్పుడు మంచి చోటు చూసుకొని పోవాలి గాదా? " అక్కడ ఇడ్లీలు పూరీలు వుంటావా ? అని ఈయన మళ్ళా అడిగాడు.

"రూప్ కుండా "మన ఇండియాలోనే - ఉత్తరాఖండు లో వుంది . ఇక్కడ త్రిసూలం పర్వతాలు అనేవి వున్నవి .అక్కడ "రూప్ కుండా " లేదా మిస్టరీ లేక్ లేదా ఆస్థి పంజరాల సరస్సు. వుంది . ఎప్పుడో పుష్పక విమానాలు వున్నరోజుల్లో ఇట్లాగే వెళ్లి అక్కడ పడిన వారు 800 మంది వరకూ వున్నారు అని లెక్క తేలింది . మా సంస్థ ఇచ్చే ప్రయాణం ద్వారా మీరు మీ పూర్వీకుల మార్గాన్నిఆ సంప్రాదయాన్ని అనుసరిస్తారు " .త్వరపడండి . బుకింగ్లు ఆరంభం చేసాము " అని తిరుగు సమాధానం వచ్చింది ఈయనకు ఇంకా ఎన్నో అనుమాన సందేహాలు వచ్చాయి . కానీ వారు బిజినెస్ పీపుల్ అవటం వల్ల మళ్ళా దేనికి సమాధానము ఇవ్వలేదు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ



My son phd. doctor varanasi satya sreekanth is a AI engineer and machine learning programmer  for the firm promoted by elen musk of amerika



**13.**నా పొట్ట గురించి మీతో 19-02-25

నిన్నటి నుండీ నా భార్య నన్ను సాపేక్షంగా చూస్తూ వుంది . అంటే కాసేపు అపేక్ష చూపి ఆ మాటున నన్ను ఎదో ఒక విమర్శ చేసేందుకు పొంచి చూస్తో వుంది అని . అనుకున్న సమయం రానే వచ్చింది - ఆమె నా పొట్ట వంక చూసి " ఆ పొట్ట చూసుకోండి చాకలి గుమ్మి లా ఉంది" మీతో కలిసి ఎక్కడికన్నా వెళ్లాలంటే నాకు చచ్చే సిగ్గు అవుతోంది . దాన్ని తగ్గించండి . " అన్నది తీక్షణంగా.

మీరైతే సిగ్గుతో తలవాల్చి - కనపడని మీ కాలి బ్రొటని వేళ్ళ కోసం చూస్తారు కావచ్చు. అవి కనపడవు అని నాకు ఎప్పుడో తెలుసు కాబట్టి నేను గొడవంక చూసాను . గోడమీద ఒక మహాముని బొమ్మ గల కాలెండర్ కనపడింది . మనకు ఆపత్కాలం వచ్చినపుడు మన

మునులు మనకు ఎదో ఒక సలహా ఇవ్వకపోరు అన్న నమ్మకంతో నేనే దానిని అక్కడ తగిల్చాను . అయన ఇచ్చిన సలహా స్ఫూర్తితో నేను ఇట్లా అన్నాను

" నీవు నా పొట్ట యొక్క ఉపయోగాలు తెలుసుకో లేక పోతున్నావు . నా పొట్టను చూసి నేను అధిక సంపన్నుడిని అని అంచనా వేసుకొని - ఆ చీరల షాప్ వాడు నీకు పాతిక వేలకు తక్కువ రేటు చెయ్యని పట్టు చీరలు నీకు చూపి పళ్ళు ఇకిలిస్తూ వున్నాడు . నేను కొంటూ వున్నాను.నువ్వు కడుతూ వున్నావు . ఇహ నీతో కలిసి పీటల మీద కూచొని వ్రతాలు నోములూ చేసినపుడు నా పొట్ట నీకు ఎంత ఉపయోగ పడుతూ ఉందొ నీకు తెల్వ . వ్రతమో నోమో నోచినపుడు - ఆ పంతులుగారు - "అయ్యా గోచీ పెట్టి ధోవతి కట్టు కొండి" అంటాడు . అప్పుడు నేను నా పొట్ట లోనికి పీల్చుకొని - ఆ ధోవతి ని నడుము కు చుట్టి ఒక చెంగు బిగించి లాగి బొడ్లో దోపుకొని పొట్ట వదులుతాను. వ్యోమగాములు సీటు బెల్ట్ బిగించుకున్నట్లు- .అట్లాగా అంతా స్టీల్ బెల్ట్ వేసి కట్టినట్లు సెట్ అయి పోతుంది . ఈ పొట్ట వల్ల నే నా గోచీ - నా ధోవతి జారిపోకుండా వుంటున్నది .ఆ జారిపోని ధోవతి వల్ల నే నీతో పాటుగా కలిసి తిరుగుతూ- నాగోచీ జారీ పోయి నీ పరువు పోకుండా గెస్ట్ లందరినీ రిసీవ్ చేసుకుంటున్నాను . అది నీ దిగ్విజయ యాత్రలాంటిది అనుకుంటే దానికి నా పొట్ట ఎంత మద్దత్తు ఇచ్చిందో చూడుమీ . చూసి బాగా ఆలోచించు - అప్పుడు ఈ పొట్ట జోలికి రా " అన్నాను .

"మీతో వేగటం కష్టం అండీ . అయినా కానీ మీరు సూపర్ అండీ . అయితే మనము ఏ జేవలరీ షాప్ కు పోయినా గానీ - మీ పొట్టచూసి- మీరు మిలియనీర్లు- అనుకుంటూ, మనకు నాలుగు ఐదు లక్ష లకు తక్కువ కానీ నగను మనకు చూపే సైజుకు మీ పొట్ట పెంచండి " అని ఆమె అన్నది .

తిరిగీ తిరిగీ ఆమె న పొట్ట జోలికే వచ్చింది . " అలాంటి ఏసీ ఆశలు ఏమీ పెట్టుకోకు - కడుపు రావటం మీ చేతుల్లో లేనట్లో - మా పొట్ట సైజు మా చేతుల్లో ఉండదు " " ఒక ఏజ్ తరువాత లేదా ఒక సైజు తరువాత మా మొగవాళ్ళ పొట్ట పెరగమన్నా పెరగదు ఇది జగమెరిగిన సైన్సు సత్యము " అన్నాను .

మొగవాళ్లకు పెరగదు అంటే ఆడవారికి పెరుగుతుంది అనే కదా? అని మీరు అర్థం లాగవద్దు. లాగి ఆమె చేత లాగి తన్నించుకో వద్దు . మీ హద్దుల్లో మీరుండండి . సరేనా .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

## 12.థాంక్ యూ డాడీ -- 18-02-25
## నువ్వపట్లో నన్ను కనలేదు అని..

టీవీ లో ఓ ప్రవచనం వస్తూ వున్నది . స్వామి పుష్పగిరి పురుషానంద స్వామి ప్రవచనం చెపుతూ వున్నాడు .

భర్తతో పాటుగా కూచుని అది వింటూ పుణ్యం సంపాదించుకుంటూ వున్నాను అని భావించుకుంటున్న భార్య " ఈయన చెపుతున్న సావిత్రీ. అనసూయ. సతీ సక్కుబాయి వంటి మహా పతి వ్రతల కథలు అప్పట్లో మా అమరావతి పాండు రంగ స్వామి గుడిలో మల్లాది వారు ప్రవచిస్తూ ఉండేవారు . అది వింటూ వుండే మా అమ్మా , అమ్మమ్మా ,నాయనమ్మ- కళ్ళల్లో నీరు కుక్కుకుంటూ ఒకరి నొకరు ఓదార్చుకుంటూ వుండే వారు . " ఆ తల్లికి ఎంత కష్టము వచ్చిందే ? ఆడ జన్మ అంటే అంతేగా ? అంటూ ఒకరినిఒకరు ఓదార్చుకుంటూ ఉండేవారు .అప్పటిలో శ్రోతల చేత కంట నీరు పెట్టించటమే ప్రవచన కర్తల టార్గెట్ గ ఉండేది . ఇప్పుడు ఆ పనిని ని టీవీ సీరియల్స్ నెత్తికి ఎత్తుకున్నవి . అయినప్పటికీ ఇప్పటి ఈ ప్రవచన కర్తలు అవే కథలు మళ్ళా మళ్ళా ఎందుకు చెపుతున్నారో ? నాకు అర్థం కావటం లేదు ." అన్నది

టీవీ లో వచ్చేది ఏదో అది అరాకొరాగానూ నో- తల్లి మాటలు అసంపూర్తిగానూ విన్న కుమార్తె ఇలా అంది " థాంక్ యూ యూ డాడీ నువ్వు అప్పట్లో మమ్మల్ని కనలేదు .ఆడపిల్లలు అంటే సాఫ్ట్ వెర్ వుద్యోగం చేయటానికి పుట్టిన వాళ్ళు అనే యుగం లో కన్నావు . ఈ ఉద్యోగాల పుణ్యమా అని ఇప్పుడు మేమెవరమూ - అక్కమొగుడిని - ముసలి మొగుడిని - ఆస్తి పరుడూ కురువృద్ధుడూ అయిన వాడిని- కాస్త వాడిని కూస్త వాడిని - కప్పు మూతి వాడిని - బాన పొట్ట వాడిని - బట్టతల వాడిని పెళ్లాడే అవసరాలు లేకుండా పోయాయి . కుష్టు రోగిని తట్టలో కూచుండ పెట్టుకొని తిప్పాల్సిన తిప్పలు లేని యుగం లో నువ్వు మమ్మల్ని కన్నావు . థాంక్ యూ డాడీ " అన్నది .

తండ్రి కూడా ఈ పతివ్రతా ప్రవచనాలు ఏమిటా ? అని ఆలోచిస్తూనే ఉంటాడు .అప్పుడు ఇంటి కీ నేత అయిన అయన దగ్గరకు ఒకటికి -రెండు- మూడు అనే ఆలోచనలు వచ్చాయి . మొదటి దానిని బట్టి అయన ఇట్లా అన్నాడు "అప్పటి లాగానే ఇప్పుడు కూడా ఎవరినైనా సరే , ఏ కొంచెము మాత్రము వాడినైనా సరే పెళ్లాడ సిద్ధ పడే యువతులు లేని యుగంలో నన్ను కన్నావు కదా ? అని నా కొడుకు నన్ను తప్పుపట్టాలని - దాంతో నేను కుమిలి కుమిలి ఏడ్వాలని అయన అట్లాంటి ప్రవచనం చెప్తూ వున్నాడు " అన్నాడు .

అయన దెగ్గరకు రొండో అభిప్రాయము కూడా వచ్చింది కదా ? దాన్ని బట్టి ఇట్లా అన్నాడు " "ఆనాటి భర్తలకు వున్న భార్యలు ఇప్పుడు మాకు లేరే అని మేము మొగవాళ్ళము కుమిలి కుమిలి ఏడవాలని ఆయన అట్లాంటివి చెపుతున్నాడు " అన్నాడు .

ఇక మూడో అభిప్రాయంగా " శ్రోతల చేత ఎమోషనల్ కన్నీళ్లు కార్పించాలన్న ప్రవచన కర్తల కాన్సెప్ట్ ఎక్కడికీ పోలేదు. పోదు . కాబట్టే ఆ కధలూ పోలేదు . అమరమైన ఆ కధలు చచ్చి పోయేవరకూ ఆయనట్లా చెపుతూనే ఉంటాడు .చెప్పి ఈ సమాజానికి ఏడవటానికి తగిన చైతన్యం కలిగిస్తూ వున్నాడు'" అని అన్నాడు .

ఇక నాలుగో అభిప్రాయం వున్నదే అది మీ వద్దకే వచ్చింది .అది మీతో ఏమి చెప్పిందో మీరే చెప్పాలి .

వింటున్న కొడుకు నిటూర్పును అణిచిపెట్టుకున్నాడు . వినవలిసిన భార్యా -పిల్ల వినటం తప్ప ఇంకేదో చేస్తున్నారు .అందువల్ల ఆ తండ్రి చెప్పిన విషయము మొగవారికి మాత్రమే పనికి వచ్చే విషయమేమో అని పించింది . అంతే కాక దీనికి ఎవరూ పైకి స్పందించకపోవటం వల్ల ఈ విషయం ఆయనకు ఆయనే చెప్పుకున్న స్వంత విషయం గా కూడా కూడా మారింది .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ .

## 11.పిడికెడు మెతుకుల వ్రతము 17 -02 -25

" అది లక్ష్మీ కాఫీ పట్టుకు రా " అన్నాడు విష్ణుమూర్తి . ఆమె తెచ్చి ఇచ్చి ఆ వెనువెంటనే వంట ఇంటిలోకి పరుగులెత్తింది . ఇల్లాలు అంటే అలా పోవాలి అనే రూల్ కోసం అయితే కాదు . ఆ కాఫీ తరువాత జరిగే దానికి సిద్ధ పడటానికి అని ఆమె అలా మళ్ళీ వంట ఇంట్లోకి వెళ్ళింది .

" ఆదిలక్ష్మీ . నీ చేతి కాఫీ రుచి అమోఘంగా వుంది . ఆ కాఫీ రుచి నా నాలుక మీద ఆనంద నాట్యం ఆడుతూ వుంది . అందుకని నిన్ను మరో కాఫీ అడగాలని వుంది . కానీ నిన్ను కష్టం పెట్టటం నాకిష్టం లేదు . నిన్ను కష్టపెట్టకుండా ఆ

రుచిని మర్చిపోవాలంటే - ఒక జ్యూసు తాగటం మించిన ఉపాయం లేదు .అంచేత ఓ లెమన్ జ్యూసే పట్టుకురా " అని విష్ణుమూర్తి అనునయంగా అన్నాడు.

ఇతడిట్ల అనునయంగా అంటాడే కానీ , చేసి పెట్టే ఆదిలక్ష్మీ కి తల ప్రాణం తోలు లోకి వస్తూ వున్నది .మూర్తి పెసరట్టు తిని దాని రుచి మర్చి పోవటానికి ఇడ్లీ అడుగుతాడు . ఇడ్లీలు తిని వాని కమ్మతనం మర్చి పోవటానికి జిలెబీలు అడుగుతాడు . జిలేబీలే రుచు మర్చి పోవటానికి కంది పచ్చడి చేయమంటాడు. కంది రుచూ మర్చిపోవటానికి మిరియాల చారు అడుగు తాడు .
ఇట్లా అది లక్ష్మి జీవితం వెలిగే స్టవ్ ఆపే స్టవ్ గా గడుస్తోంది .

"చెయ్యను" అనటానికి ఆమె హక్కు కోల్పోయిన విధము - "చెయ్ "అని ఇతడు హుకూం వెయ్యటానికి గానూ ఇతనికి అవకాశము దొరికిన విధము మనము తెలుసుకో తగ్గది .

పెళ్లి కాగానే భర్త భార్యకు అరుంధతీ నక్షత్రం చూపిస్తాడు . భార్య చూస్తుంది . భార్య భర్త మాట చటుక్కున విన్న అమృత ఘడియలు ఆవే కావచ్చు . ఈ అమృత ఘడియ గడిచాక ఆమె " మా అయన నాకు చుక్కలు చూపించాడు " అనే కచ్చి మనసులో ఎట్టుకుని ఆయన్ని జీవితాంతం సాధిస్తుంది .

అమృత ఘడియల టైం లో విష్ణు - తన భార్యతో " నాకు తల్లి లేదు . నాన్న వండి పెట్టాడు .
రుచులకు మొఖం వాచీ పోయాను. అందుకనీ నేను అడిగినవన్నీ వండి పెడతాను అని ప్రామిస్ చేయి " అన్నాడు . అవి అమృత ఘడియలు కాబట్టి ఆదిలాక్షి ఏమీ ఆలోచించకుండా " నాకు నాన్న లేడు. అందుకని మా అమ్మ ఏ వ్రతాలూ నోములూ నోచలేదు . అవి కుప్పలు తెప్పలు గా చేయాలనీ న కోరిక . మీరు కాదనకుండా ప్రతి నోముకూ ఫండ్స్ ఇవ్వాలె " అన్నది . ఓకే అన్నట్లుగా ఇద్దరూ ఒకరి చేయి ఒకరు దొరకపుచ్చుకొని పిసుక్కున్నారు . ఈ ప్రామిస్ ను అతిక్రమించ జాలక అది లక్ష్మి జీవితం వంటింట్లో లాక్ అయి పోయింది .

భార్య అంటే భార్యనే . అందువల్ల అది లక్ష్మి ఒక నాడు పుట్టింటికి అని పోయింది . పోతూ పోతూ ఓ వంట మనిషిని కుదిర్చి పోయింది . వెళ్లి మూడో నాటికి వచ్చింది . వచ్చి " మీకు వండి పెట్టటం మానేసే సరికి చేతికి ఎదో గుల గుల వచ్చేసిందండి . అది పోవాలంటే ఏదన్నా నోము నోచి ఓ వందమందికి భోజనాలు వండి పెట్టాలనే ఫీలింగ్ వస్తోంది " అన్నది .అన్నది ఆచరించింది . ఆ మర్నాడు " ఈ వంద మందికీ వండిపెట్టిన ఫీలింగ్ పోవాలంటే ఎంతో మందికి వండిపెడితే కానీ పోదు అని పిస్తోంది . ఇలాటి దానికోసం " పిడికెడు మెతుకుల " వ్రతము వున్నదని మా బామ్మ ఫోనులో చెప్పింది . ఆ వ్రతము చేస్తాను .మీ ఖర్చేమీ లెదు - మీరు కాదన వద్దు .- మీ కాలు మొక్కుతాను " అని చెప్పి భర్త పర్మిషన్ పొంది ఏ వ్రతం స్టార్ట్ అప్ చేసింది . మొదట వంద మందికి వండించి పెట్టింది కదా ? అప్పుడు ఐన ఖర్చు ను చూసిన భర్త యొక్క తిండి వ్యవహార శైలి లో ఏదన్నా మార్పు వస్తుందేమో నని ఆశించింది .తనలో ఎదో మార్పు తీసుకు రావటానికి అని - ఇది భార్య వేస్తున్న ఒక ఎత్తు అనుకున్నాడో ఏమో భర్త ఏమీ లొంగి రాలేదు .మామూలుగానే సతాయిస్తూ వున్నాడు.

వున్నట్లుండి ఆది లక్ష్మి " రేపు పిడికెడు మెతుకుల వ్రతం" చేపడుతూ వున్నాను అని ప్రకటించింది. ఇంతకు ముందే ఆమె ఒక వాట్సాప్ గ్రూప్ క్రియేట్ చేసి 400 మంది మహిళలని చేర్చుకుంది . ఇప్పుడు వారికందరికి ఆహ్వానాలు పంపింది " పిడికెడు మెతుకులు తిని- పసుపూ కుంకాలు అందుకొని వెళ్ళండి " అని. వారు వచ్చారు . ఏమి జరుగుతోంది విష్ణూ మూర్తీ చూస్తూ కూచున్నాడు .200 మంది ముత్తయిదవలు వ్రతానికి వచ్చారు ఇదేందో చూద్దాము అని . అది లక్ష్మి అందరినీ కూచో పెట్టి " వారి విస్తర్లలో పిడికెడు మెతుకులు- గంటె పప్పు - గంటె కూర వేసింది . "ఈ వ్రత విధానము ఏమని ?" అన్న వారితో ఇట్లా చెప్పింది .
" మీరు ముందుగా ఈ పిడికెడు మెతుకులు తిని ఆలా కూచోండి .ఈ లోగా మీకోసం ఫ్రెష్ గా రెండో భోజనం వండించి మళ్ళా రెండు పిడికెళ్లా అన్నం రెండు గంటెల పప్పు - రెండు గంటెలల కూరా పెడతాను . అది తిని ఆలా కూచోండి . ఈ లోగా మీకోసం ఫ్రెష్ గా మూడో భోజనం వండించి మల్ల మూడు పిడికెళ్లా అన్నం పెడతాను.
ఇలా ముప్పై ఆరు పిడికిళ్లు అయే దాకా పెడతాను . మీరు తిన్నంత తిని పారవేసినంత పారవేయవచ్చు . ఈ వ్రతానికి అది దోషం కాదు . ఇది రేపు కూడా

ఉంటుంది .ఎల్లుండి కూడా ఉంటుంది . ఇట్లా ఇది ఆరు రోజుల వ్రతము . యేడవ రోజున పతి దేవునికి మొక్కి మీకు పట్టు చీరలు బహుకరిస్తాను "అన్నది. వ్రతము ఆరు రోజులూ సాగి ఎడో రోజున దిగ్విజయంగా ముగిసింది ."ఇలా ఏడు దఫాలు చేస్తే నాకు భర్తతో కలిసి స్వర్గ ప్రయాణం " అని ఆ తాళ పత్ర గ్రంధం లోనిఈ వ్రత కధలో రాసారు " అని ఆది లక్ష్మి భర్తతో అన్నది .

"అది లక్ష్మి తన భర్తకు చక్కగా బుద్ధి చెప్పింది అన్నట్లా ?" అని తెలిసీ తెలియని వారు అన్నారు ." కాదు - తన భర్తకు వండీ వార్చటం లో అది లక్ష్మి తన జీవితాన్ని పునర్నకితం చేసుకున్నది " అని అన్నీ తెలియని వారు అన్నారు .
" నీకీ డబ్బు ఎక్కడనుండి వచ్చింది అని ?" అని మూర్తి అడిగాడు .ఎవరి డబ్బైనా గానీ కరిగిపోతోంది గా అనే దుగ్ధతో .
"పూజ్యురాలు ఐన మీ అమ్మగారు-- నా అత్తగారు ఈ వ్రతానికి మద్దత్తు పలికి - మీకు ఇద్దాము అనుకున్న ఏడు ఎకరాల మాగాణీ పొలాన్ని నాకు రాసిచ్చారు . దానిలో ఒక ఎకరం అమ్మి ఇప్పుడీ గండం గడిపాను "అని ఆదిలక్ష్మి అన్నది .
" మిగిలిన ఆ ఆరు ఎకరాలు " సర్వ మంగళ ము " అయిపోకుండా చూతమని - ఆలోచించిన మూర్తి "నీ వ్రతాలకు నేనిచ్చిన ప్రామిస్ ను వెనక్కు తీసుకొని గట్టు మీద పెట్టుకుంటున్నాను . నువ్వు అట్లాగే చేయి . నా అభ్యంతరం ఉంటే చెప్పు తీసి అడుగు " అన్నాడు .
శ్రీ పాద వారి వడ్లగింజలు కధలో జరిగినట్లు ఇక్కడ కూడా ఎదో మనము లెక్క కట్టలేనిది జరిగినది అని గ్రహించిన వారు అచ్చ తెనుగు ఆంధ్రులు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

పై కథగురించి కొందరి అభిప్రయాలు - నా సమాధానాలు

**Madhuri Varanasi**
[https://www.facebook.com/groups/1623989977901118/user/100002767278927/](https://www.facebook.com/groups/1623989977901118/user/100002767278927/)

తల్లి లేకుండా తండ్రి చేతి వంట తిన్నాడు కదా....

ఇలా అడిగిన ఒకరికి సవితి తల్లి,దత్తత తల్లి కావచ్చు అన్నారు...
ఏదో లింక్ మిస్ అనిపించింది.

కానీ బావుంది కథ వెరైటీగా !

**Madhuri Varanasi** మీరు ఎత్తి చూపిన విషయాన్ని మెచ్చుకంటూ వున్నాను . కానీ ఇలాంటివాటిని మీరు " **explore possibilites** " అనే దృష్టితో కూడా చూడవలిసి ఉంటుంది అని భావిస్తాను . అనగా " ఇట్లా జరగటానికి ఎట్లా అవకాశము వున్నదీ**?** అని కూడా ఆలోచించమని .
దీనికి నేను ఇట్లా వివరణ ఇస్తాను . ఇంతకు మునుపు రాసిన "సంజీవినీ ఆకూ" అనే కథలో ధరణికోట పెద్దమ్మ అనే ఆమెను గురించి ప్రస్తాపించాను . ఆమె నిజంగా వున్న మనిషి ఏ. . ఆమెకు సంతతి లేదు . చెల్లి మరణించగా చెల్లిబిడ్డని దత్తత తీసుకొని- తల్లి లేని పిల్లవాడు కాబట్టి నాలో తల్లిని చూసుకుంటాడని ఆశించింది . కానీ వాడు తల్లి కన్నా ఎక్కువగా పుట్టిన ఇంటినీ ఊరినీ ఇష్టపడ్డాడు **.30 KM** పాటు నడుచుకుంటూనే సొంత ఊరుకు వెళ్ళిపోయాడు . అందువల్ల ఆ పిల్ల వాడి తండ్రి వాడిని తిరిగి వెనక్కి పంపక తానే పిల్ల వాడికి వండిపెట్టుకుంటూ కాలం గడిపాడు . అయితే మా పెద్దమ్మ పట్టు వదలక " మొగపిల్ల వాడు అంటే అంతే " అదే కోడలు ఐతేనా**?"** ఎక్కడికి పోతావు నాతోనే వుండు. నన్ను చూడు " అని అడగ వచ్చు అనే ఆలోచనతో తనకు అన్న వరుస ఐన వాని కూతురు ఆదిలక్ష్మిని తెచ్చి ఆమెకు ఆస్తి ఇచ్చి - పెంపుడుకొడుక్కు ఇచ్చి పెళ్లి చేసింది .ఇలాంటి పెళ్లిళ్లు మామూలే . ఈ ఆదిలక్ష్మి న్ పాత్రకూడా యదార్ధమైనదే .
ఈ రకంగా మూర్తి దత్త పుత్రుడు అయి నాడు - దత్తు అనేది ఆఫీసియల్ గా జరగనందున పెంపుడు కొడుకు కూడా అయినాడు . ఆదిలక్ష్మి కోడలు ఐంది " యదార్ధంగా జరిగినదంతా కథలో చెప్పనవసరం రాలేదు కనుక నేను ఈ వివరం చెప్పలేదు . కానీ ఆ పాత్రల నేపధ్యం ఏమిటో నా మనసులో నే వుంది . అందుకని అలరాశాను . మీరు ఎప్పటిలాగానే చదువుతూ నన్ను ప్రోత్సహిస్తూ వుండండి . మీకు నా ధన్య వాదాలు

## 10. సంజీవినీ ఆకు 16 -02 -25

సంజీవినీ అనే మూలిక వున్నదీ అంటే దాని ఆకూ వుండేవుంటుంది . ఇది ఆ ఆకు గురించిన కథ అనుకోని ఆనక నిరాశ పడవద్దు .

మా చిన్నతనంలో" ధరణికోట అమ్మ" అని మా పెద్దమ్మ ఉండేది .పేరు అన్నపూర్ణ . ఆమెకు సంతతి లేదు. కానీ సంతానం కలిగితే ఎలాపెంచాలో వారికి ఏమి నేర్పాలో అనేది ఎప్పుడు ఆమె వూహ చేసుకుంటూ ఉండేదని నాకు ఇప్పుడు అనిపిస్తుంది .

ఆమె ఒక నాడు వాళ్ళ చేలోనుండి పీక్కు వచ్చిన గోంగూర మొక్కలనుండి గోంగూర విడదీస్తూ వున్నది . నేను ప్రక్క సాయంగా వున్నాను .నేను గోంగూర ఆకులు అన్నీ గిల్ల కుండా , కొన్ని ఆకులను ఆ గోగు కాడలకే వదిలేసి వాటిని ప్రక్కన పడవేస్తూ - నేను నా బాల్య చాపల్యం ప్రదర్శిస్తూ వున్నాను . అప్పుడు మా

అమ్మ అన్నది " మన ఇంటికి వచ్చిన ఏ వస్తువుకైనా పండుకైన పుష్పానికైనా సంతోషం కలగాలి . నువ్వు చీడ పట్టకుండా శుభ్రంగా వున్నా ఒక గోంగూర ఆకును పడేసావే అనుకో - గోంగూరకు సంతోషం పోయి దుఃఖము వస్తుంది . తల్లి మొక్క తనకు పుచ్చు  పురుగు పట్టకుండా ఎంతో ప్రయత్నం చేసుకొని - పండునో పువ్వునో కంటుంది .ఫది మంది సంతానము కన్నా తల్లి - వారిలో ఏవొక్కరిని ఐన ఎవరైనా చిన్న చూపు చూస్తే తల్లి సహించదు . వాడు చేసిన పుణ్యములో ఏమి తక్కువ  అని విలపిస్తుంది . అలాగే గోంగూర మొక్క కూడా మనము ఒక మామూలు ఆకును వృధాగా పారవేస్తే " ఆ ఆకు చేసిన తప్పు ఏమిటి ?అని " ఏడుస్తుంది  . అది ఏడవనవసరం లేకుండా చూచి , దాన్ని సంతోష పెట్టావో అనుకో అది తన నుండి వీడే ప్రతి ఆకునూ సంజీవినీ ఆకుగా మారుస్తుంది . అంటే మన గోంగూర పచ్చడికి అమృతపు రుచి వస్తుంది . నువ్వు కమ్మగా తింటావు - అప్పుడు నీకు బలం వస్తుంది . నా పాడె మోయగలుగుతావు . లేదంటే మన పచ్చడి చెడి పోతుంది " అన్నది . మా పెద్దమా  గుంటూరు జిల్లా మనిషి . గుంటూరు గోంగూరను అంతర్ జాతీయ ఖ్యాతి రావటానికి ఇలాంటి ఎందరో పెద్దమ్మల భావనలే  కారణం అని నేను భావిస్తాను .

" ఆమె నా చిన్న తనం లో నా తలలోకి ఎక్కించిన ఈ సంజీవినీ కాన్సెప్ట్ - వంకాయలు బెండకాయలు - పూలు పళ్ళు అన్నింటికీ వర్తిస్తుందని నేను ఆమె వద్దకూచూ వుండేటపుడే  తెలుసుకున్నాను . వంకాయ తొడిమ దేగ్గర్లో - బెండకాయ, దొండకాయ , పొట్లకాయ , కాకర కాయ  తొడిమ దేగ్గర్లో నూ - చివర్లనూ   - సంజీవిని ఉంటుందని ఆమె నాకు చెప్పింది .తొడిమలూ చివర్లూ ఎంత తక్కువకు వీలైతే అంత తక్కువకు తరిగేది . అందువల్లే ఆమెకూరలు అమృతంగా వుంటాయని  నేను నమ్మే వాడిని .

ఈ  సంజీవినీ కాన్సెప్ట్ - వృధాని అరికట్టటానికి అని  ఆమె కల్పించి చెప్పినదే  అని మీకు ఈ పాటికి అర్ధం ఐయ్యే  ఉంటుంది . పిల్లలకు ఇంత చక్కగా నూరి పోయగల పెద్దలు ఇప్పుడెవరున్నారని ?

ఇలాంటి ఊహలు ఎన్నో చేసి మా పెద్దమ్మ ఏమి సాధించిందో ? లక్షలు ఎమన్నా కూడా పెట్టిందా?  అని నేడు నాకు ఒక సందేహం వచ్చింది . మనుషులందరూ ఒకే

తీరుగా అంటే రొండు కాళ్ళు రొండు చేతులు ఒక ముక్కు రొండు కళ్ళతో వుంటారు .కానీ శరీర ఆకృతులే మారుతూ ఉంటాయి . మరి వీరి లోని ఆత్మ అనేది ఎలా వుంటుందో ? అందరిలో ఒక్క లాగానే ఉండవచ్చు . కానీ ఆత్మకు ఒక ప్రత్యేక స్వరూపం ఇవ్వటం - దానికి మరింత ఆయుష్షు ఇవ్వటం మనిషి చేతుల్లోనే వుంది . మా పెద్దమ్మ ఏమి ఊహలు చేసినా ఆత్మకు ఒక రూపాన్ని ఇవ్వటానికే చేసింది అనవచ్చు . ఇవాళ నేను ఒక గోంగూర పచ్చడి నో - ఇంకేదో కూరనో - తినేటపుడు ఒక ముక్క కిందపడిపోతే నూ అట్లాగే అన్నం మెతుకులు కిందపడితేనో వాటిని జాగర్తగా తీసి కంచంలో కాకా నోటిలో వేసుకుంటాను . ఇసుక మట్టీ వంటిది ఏదన్నా అంటితే దానిని ఉమ్మి వేయవచ్చు కదా అని . కానీ అవి ఎంతో రుచిగా అనిపించి అసలు కూరమీద మక్కువ పెరుగుతుంది. నేను ఇలా చేసినప్పుడల్లా " ఇప్పుడు నా పెద్దమ్మ ఆత్మ ఎంత సంతోషిస్తుందో అన్న " గిలిగింత కలుగుతుంది .

మా పెద్దమ్మ తన ఆత్మ కు సంజీవిని ఆకు అనే రూపం ఇచ్చింది . అది రాలి పోయి గాలికి కొట్టుకు పోకుండా ఆపింది అనవచ్చు . ఈ సంజీవిని వల్లే ఆమె దేహము నశించిన పిమ్మట కూడా ఆమె ఆత్మ ఇంకొంత ఆయువును సంపాదించుకున్నది . ఆత్మకు ఒక రూపము ఇవ్వటం అంటే ఈ గోంగూర కబుర్లు కాదు . ఎదుటి వారి మనస్తత్వాలను తీర్చి సిద్ధేందుకు - వారికి ఏదో ఒక మంచి దారిలో పెట్టేందుకు - మంచి ఆలోచనల వైపు మరలించేందుకు మనము ఆత్మ శుద్ధి తో చేసే ప్రయత్నాలే -మనము మన ఆత్మకు ఇచ్చుకునే రూపాలు అవుతాయి .అట్టి ఆత్మలకు నివాళులు అందుతాయి .

అప్పటికి నేను చిన్న పిల్లవాడిని కదా - నేను పెద్ద అయ్యాక ఇట్లా కూచుంటానో లేదో అనే ముందు ఆలోచనతో ఆమె అప్పటి నా వయస్సుకు తగ్గట్లు నన్ను తీర్చి దిద్ద దలిచి ఈ సంజీవినీ ఆకును ప్రయోగించింది . అవున వచ్చునా ? కాదన వచ్చునా ? మా పెద్దమ్మ - ఆత్మకు ఒక రూపము ఇవ్వవచ్చు అని ఆమె తెలిసే అలా చేసిందా ? లేక ఆత్మకు ఒక రూపము ఇవ్వవచ్చు అని మనకు తెలియక మనము చేయటం లేదా ?

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

ఈ కథ పై కొన్ని అభిప్రాయాలు
మీ ద్వారా మీ పెద్దమ్మ ఇంకా జీవించే ఉంది...ఆవిడకు నా నమస్సుమాంజలి...ఇది నేను నా పిల్లలకు కూడా చెప్తాను..నా మనవడికి కూడా...ఇంత మంచి ఊహను మాతో షేర్ చేసుకున్నందుకు మీకు ధన్యవాదాలు**Usha Chennakesavula-**
**https://www.facebook.com/groups/7616224548478392/user/100007543836942/**

మనిషి మనస్తత్వం వారి మనసు స్పందించే తిరుని బట్టే, నమ్మిన మనః సిద్ధంతాన్ని బట్టే మనిషి ప్రవుర్తి మలచబడుతుంది. మీ పెద్దమగారు అన్ని సద్గుణాలు పొదిగిన దృఢ సంకల్పి కాబట్టే అవి మీ పైన, ప్రభావితం చేస్తూ, ఈ రోజిల నలుగురికి ఆ సుగుణలు తెలియజేసెల మీ మనసుని స్ఫూరింపజేస్తున్నాయి.
ఆత్మకి రూపం లేకున్నా కనపడకున్న, ప్రభావితం చేసే సద్గునాలే, కార్యరూపంలో అక్షర రూపంలో, భావ వ్యక్తికరణ రూపంలో, మాటలతో ఇలా ఒక రూపం ఇవ్వడమే కదా, కనిపించని పవిత్ర ఆత్మలకు రూపం ఇవ్వడం🙏

**Radhika Ramisetti–**https://www.facebook.com/groups/7616224548478392/user/100045892633685/

## 9.స్వయం మరణం కేసు . **12 -02 -25**

"ప్రాసిక్యూషన్ వారి అభియోగాలు ఏమిటి ?
"మై లార్డ్. ఈ స్త్రీ తన భర్తపై రుబ్బురోలుతో దాడి చేయటం ద్వారా ఆయనను చంపివేసింది"
" దాడికి కారణం ?"
" ఆయనకు న్నా చాదస్తమూ - చేత్వారమూ రెండూ నూ. తన చాదస్తముతో అయన తన భార్య ను - రోటిలో రుబ్బిన పప్పు తో ఇడ్లీ వేయమని, గారెలు చేయమనీ పురమాయిస్తూ ఉండేవాడు . ఆ పురమాయింపులకు తట్టుకోలేక ఈ స్త్రీ సహనం కోల్పోయి తన భర్త పై దాడి చేసింది . అయన ను చంపి వేసింది "
" డిఫెన్సె లాయరు గారూ దీనికి మీరేమంటారు ?'"

"ప్రభుత్వపు లాయర్ గారు నాక్లైంటుకు త్వరగా ఎదో ఒక శిక్ష వేయించాలని తొందర పడుతూ వున్నట్లుండి. నా క్లయింట్ అయినా ఈ సూర్య లక్షి గారు ఒక పౌత్రము చేబూని భర్తపైకి దూకారు అన్నది వరకూ నిజము . కానీ ఆమె చేతిలో వున్నది ఒక రబ్బరు పౌత్రము .ఈ ముద్దాయి సూర్యలక్ష్మి మంచి తెలివి కలది .ఆమెజో నుండి ఒక రొబ్బరు పౌత్రమును ఆర్డర్ చేసి తెప్పించుకొని - ఈ పౌత్రముతో పప్పు రుబ్బుతున్నట్లు గా నటించి - చివరిలో ఆపప్పును మిక్సీయే వేసి పడేసేది . కాలక్రమేణా అయన అందులో ఎదో తేడా కనిపెట్టి మరీ మరీ గొణగటం వల్ల - మా సూర్య లక్ష్మి మనః శాంతి కోల్పోయి రబ్బరు పౌత్రం చేత బట్టుకుని భర్త వద్దకు పోయింది గానీ - రాతి పౌత్రము పట్టుకుని అయన మీద దాడికి పోలేదు "

" అది రబ్బరు పౌత్రము అని ఆయనకు తెలుసునా ?"

" తెలియదు అనటానికి వీలు లేదు . " వన్ రబ్బర్ పౌత్రం దెలివెరుడు " అనే కొరియర్ రసీదు పై అయన సంతకము ఏ ఇందుకు సాక్షం "

" డాక్టర్ ప్రవల్లికా గారూ మీ నివేదికలో ఏమి చెప్పారు ?

" మై లార్డ్. మృతుడు పౌత్రము వలన మరణించాడు అని చెప్పాను . అనగా పౌత్రము తలపై పడటం వల్ల మరణించారు అని కాదు . పౌత్రము పుచ్చుకుని భార్య వస్తూ వున్నది -అనే షాక్కి భయంతో మరణించాడు అని .మొత్తానికి కారణము పౌత్రమే కాబట్టి " పౌత్రము వలన మరణము" అని నివేదిక ఇచ్చాను.

" కేసు యొక్క పూర్వా పరాలు విచారించిన పిమ్మట ఇలా తీర్పు ఇవ్వటమైనది "భార్యకు రొబ్బరు పౌత్రము కొని పెట్టిన వాడు భర్త ఏ అనుటలో సందేహము లేదు . కానీ కీర్తి శేషుడైన ఆమె భర్తకు ఛేత్వారం వున్నదనుట నిస్సందేహము . అందువలన అయన కొరియర్ వారి రసీదు లో వున్నా " వన్ రబ్బర్ పౌత్రం దెలివెరుడు " అనేది పూర్తిగా చదివినాడా లేక గ్రుడ్డి సంతకం పెట్టినాడా అన్నది మనకు తెలియదు . ఏది ఏమైనా పౌత్రం పట్టుకుని ముందుకు వస్తున్న తన భార్య చేతిలో వున్నది అసలు పౌత్రమా లేక రబ్బరు ?పౌత్రమా ? అన్న సంగతిని ఆయనకున్న చత్వారము కొద్దీ

అయన సరిగా వోల్చుకోన లేక వోయినాడు అని - . అప్పుడు అయన స్వయం భీతి కొద్దీ స్వయం మరణం పొందాడు అని తీర్పు ఇవ్వటమైనది . "

" లెస్స లెస్స - రబ్బరు పొత్రము కాని పొత్రము పట్టుకుని- పూజ నీయు రాలైన ఏ భారత నారి కూడా తన భర్త మీదకు దూకే అపచారం చేయదు ? అన్న కోణం లో శాంతంగా ఆలోచిస్తే - ఈ తీర్పు హ్వానించ తగినది " అంటూ సూర్య లక్ష్మి బంధువర్గము హర్ష ధ్వానాలు చేశారు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క స్వంత కథ.

COMENTS

**1.**చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ.

రాసే వారికి లక్షలకొద్దీ పాఠకులు మహాదేవ

BY Saraswathy Devarakonda - https://www.facebook.com/groups/412771029925082/user/100053172591843/

## 8.పెళ్లి - పళ్ళు 6-2-20 తిరిగి 11 -02 -25

పెళ్లిచేసుకోవటం గురించి ఎవరో , ఎన్నో చెప్పగా లేంది నేను మాత్రం ఎందుకు చెప్పకూడదు ? అన్న ఆలోచన వచ్చింది .అందుకని ఇదివరలోనే చెప్పేసాను . అప్పుడు చదవని వారి కోసం ఇప్పుడు అన్నమాటా .

పెళ్లిచేసుకున్న రోజున అబ్బాయికైనా అమ్మాయికైనా - పైవరసలోనో , కిందవరసలోనో , వుండాలిసిన పళ్ళు - జ్ఞ్యాన దంతం తో సహా మొత్తం మొలిచినట్లు . అప్పుడు గాని - అబ్బాయికీ /అమ్మాయికీ గానీ జీవితాన్ని , చెరుకు ముక్కలా నమిలి మింగి అందులోని రసాన్ని ఆస్వాదించటం కుదరదు.

ఇంకా -భర్త లేదా భార్య లో ఎవరో ఒకరు మరణిస్తే - ఒక్క క్షణంలో - ఎదో ఒక వరుసలో వున్నా పళ్ళు మొత్తం ఊడిపోయినట్లు . రేడు వరుసలలో ఒక వరుస

పళ్ళు లేకపోతే , ఇక మిగిలిన జీవిత కాలాన్ని నమిలేదీ లేదు - అందులోని రసాన్ని ఆస్వాదించేదీ లేదు.

భార్య చనిపోయినక మరో పెళ్లి చేసుకోవటం మొత్తం కట్టుడు పళ్ళు పెట్టించుకోవటం లాంటిది . కానీ ఒరిజినల్ పళ్ళ లాంటి భార్య కు సాటివచ్చే మరో పళ్ళ సెట్ ఉండదు .

కళ్ళతో చూసిన పండుని - పళ్లతో కొరుక్కు తినాలన్న ఆత్రమే పెళ్లి.

పండు అనుకున్నంత కమ్మగా లేక పోవటమే జీవితానుభవం. పండు కమ్మగా లేదనటం భర్త విధి. కాదు అది కమ్మనిదే - మీ నాలికే తుప్పు పట్టింది అని అనునయించటం భార్యల విధి .

- వైరాగ్యమా-వైవాహికమా ఇద్దరిలో ఎవర్ని నమ్మాలి అని ప్రశ్న వచ్చినప్పుడు - కన్ను కన్నా పన్నే ఎక్కువ నమ్మతగ్గది . కన్ను చూసిన ది ఎండమావి లాంటి వి - ఏ దాహమూ తీరదు . పళ్ళు .తియ్యని అనుభూతులేనన్నో నమిలి మనసు నింపుకోవటానికి పనికి వస్తుంది .

తియ్యని అనుభూతులన్నీ నమిలి మింగి తింటానికి పళ్ళు కావాలని - మనం పెళ్లి చేసుకుంటాం. ఒక్కో సారి మనకు అక్కర లేని రకం గా పళ్ళు మొలుస్తాయి. అదే అణుకువలేని భార్య లేదా ఆదర్శం కాని భర్త

ఒక వరుస పండ్లు లేని జీవితం - గొడ్డు కారం తిన్నట్లు గా కూడా ఉంటుంది. అది తినడానికైనా పళ్ళు ఉండాల్సిందే. ఎదో ఒకటి తినకుండా రోజులు వెళ్ళమారవు కదా ?

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

ఎదో ఒకటి తినకుండా రోజులు వెళ్ళమారవు కదా ? అని అప్పుడెప్పుడో రాసాను . నా పళ్ళు ఐన నా భార్య న ఉమా దేవి మొన్నామొన్నసే మరణించి - ఈ మాటలను అక్షర సత్యం గా మార్చి పోయింది. ఇది ఆమె దివ్య స్మృతికి అంకితం .
11 -02 -25 మంగళ వారం .



**7.**అర్ధనారీశ్వర తత్వం **10-02-25**

అనేక మారులు యోచించినా కానీ అర్ధనారీశ్వర తత్వము ఏమిటో అవగతము కాదు . ఇది ఒకటి కాదు అనేకము అని తోస్తుంది .

తండ్రిని కోల్పోయి - తండ్రిలోని ధీరత్వము - తెగువ -కష్టపడే తత్వము - తల్లిలో కనపడి ఆమెకు ప్రణమిల్లిన - వారు అర్ధనారీశ్వరుని కనుగొన్నారు అని ఎంచాలి .

తల్లి ని కోల్పోయి - తల్లి లోని ఆందోళనలు-ఆప్యాయతలు , ఆదరమూ , -- తండ్రిలో కనపడి అయన అశీసులు కోరినవారు కూడా అర్ధనారీశ్వరుని కనుగొన్నారు అని ఎంచాలి .

మీరు చేసిన ఏ సత్కార్యమో పండి - మీ ఇంట్లో చిన్న వాడు పుట్టి వాడు మీ తల్లిని పోలి నడయాడుతూవున్నాడు అని మీకు అనిపించినపుడు - మీఇంట్లో పుట్టిన చిన్నది మీ తండ్రి ముఖ కవళికను గాంభీర్యానీ ప్రదర్శిస్తూ వున్నదని మీకు అనిపించినపుడు కూడా అర్ధనారీశ్వరుని కనుగొన్నారు అని ఎంచాలి

శివుడు భక్త సులభుడు . అందువల్ల అయన మీచే పూజలు మంత్రాలూ ప్రార్ధనలూ చేయించడు .మీలో మంచి ఊహలను ప్రారంభించి - "నువ్వు సహజమైన పూజ మొదలుపెట్టావు అది కానివ్వు" "అది ఎదో అయ్యే దాకా ఇద్దరమూ ఒక్కటై ఉందాము అంటాడు" .ఈ సహజమైన పూజ అనంత కాలమూ కొనసాగవచ్చు . ఈ అనంత కాలములో "ఈ ఒక్కటి అయి ఉందాము" లో అయన స్త్రీ పక్కన ఆసీనుడైన ఆమె భర్త - ఈ అనంత కాలములో "ఈ ఒక్కటి అయి ఉందాము" లో అయన పురుషుడికి- వెన్నుగా నిలిచిన గా నిలిచిన భార్య -పార్వతి. ఇప్పుడుకూడా మీరు అర్ధనారీశ్వరుని కనుగొన్నారు అని ఎంచాలి .

నేను ఇవాళ .అనాధగా వీధులలో తిరిగే ఓ వృద్దుడిbకోసమని ప్రత్యేకం "టిఫిన్" కట్టించి ఇచ్చాను . మధ్యాన్నాపు ఆహారము గురించి అతను బాధ పడకూడదు అనే తదుపరి ఆలోచన వచ్చి నాకోసం తెచ్చుకుంటున్న పూరీలు కూడా అతనికే ఇచ్చాను ." "ఇలాంటి 60 - 70 వయసు వారు - ఎదో ఒక పెద్ద గోతపు సంచీ పట్టుకొని ఎందుకు తిరుగుతారు ? అని నేను ఈ పని చేయ నన్ను ప్రేరేపించిన వారిని అడిగాను ..

" ఆదిభిక్షువు ఎప్పుడూ నడుస్తూ నే ఉంటాడని - ఆయనను ఎప్పుడు పడితే అప్పుడు- ఎక్కడ పడితే అక్కడ చూడ వీలుందని నీకు గుర్తు చేయటానికి వారు అట్లా చేస్తారు "

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

## 6.అమ్మలు తెలుసుకోవాలె 2-2-25

ఆ అమ్మాయి ఎవరో ప్రయోజకుని ప్రేమలో పడ్డదని తెలుసుకున్న తల్లి ఇట్లా అనే " ఆవు , వాడేమి మాయమాటలు చెప్పాడే ? చంద్రుడిని తీసుకొచ్చి చేతుల్లో పెట్టా నన్నాడా ? చుక్కల్ని కోసుకొచ్చి జడలో పెట్టా నన్నాడా ?

ఎమన్నా కానీ అవన్నీ నిజం కాదే . వాళ్ళు తరతరాలుగా అలాచెప్పే ఆడపిల్లలని మోసగిస్తూ వున్నారు "

పిల్ల అన్నది " అతను అలాంటి వాడే కాదు . చెంద్రుడ్ని తెచ్చి ముక్కల పులుసు చేసుకుందాం . మబ్బుల్ని పట్టి తెచ్చి కూల్ డ్రింకుల్లా తాగుదాము - నక్షత్రాలు తెచ్చి నూనెలో వేసి వడియాల్లా వేపుకు తిని. కొన్ని నక్షత్రాలతో పాప్ కార్న్ కుందామని అన్నాడు . ఈ కమ్మని రెసిపీలు అన్నీ తానే వండుతా అన్నాడు . ఇందులో మోసం ఏముంటుంది చెప్పు . ?"

కొత్త ప్రేమ కధ మొదలైనపుడు దానిలో ఏ అసాధ్యమూ ఉండదు అని అమ్మలు తెలుసుకోవాలె .

వారణాసి ఉమా శ్రీరామకృష్ణ అఫ్ అమరావతి సొంత రచన .

**5.**ఏం చేయమన్నావు మూర్తీ ? 31 -01 -25

" తాను పూరాగా ఢీలా పడినపుడు - మా సుందర మూర్తి ఓ అప్రయోజకుని పేస్ పెట్టుకొని - వీధి అరుగు మీద కూచుంటాడు. ఇట్లాంటప్పుడు భద్రత కోసమని వీధి గేట్ కు తాళం కూడా వేస్తాడు. భద్రత అంటే భార్యపేడెన్ గా అరుగు పైకి రాకుండా వుండటానికని .

" ఏమివాయ్ సుందరం - పూరాగా పులుసులో ఉడికిన ముక్కాలా పేస్ ఉంచావు . మే మన్నా తెలుసుకోవచ్చునా ?' అని అయన పక్కన మేము చతికల పడినాము.

"మీరు తెలుసుకో తగ్గ విషయమే . నేను మా పల్లెటూరిలో ఉన్నంత వరకూ ఊరి లో - ఈడుకొచ్చిన ఆడపిల్లలు ఎందరున్నారా ?ఎక్కడున్నారా ? అనే జనాభా లెక్కలు తీసాను . మొత్తం 51 మంది లెక్క కు రాగా ఓ యాభై మందిని మార్చి మార్చి లవ్ చేసాను . ప్రతి ఒక్క పిల్లా వెనకా తిరిగి "ఐ లవ్

యూ " లు చెప్పాను . " ఓహో అలాగా ? ఏంపాపం ?" అన్నవారే గానీ వెనక్కి తిరిగి ఐ టూ లవ్ యూ అన్నవాళ్ళే లేకపోయారు . 51 నెంబర్ పిల్లకి ఐ లవ్ యూ చెబుదాము అనుకునే లోగానే నాకు స్టేట్ బ్యాంకు వుద్యోగ్యం వచ్చింది . అప్పుడు ఆ 51 నెంబర్ పిల్లా వాళ్ల తల్లి తండ్రులే మా ఇంటికి వచ్చి నన్ను తమ అల్లుడిని చేసుకున్నారు . అప్పుడి మొదలు నా భార్య " ఊరంతటికీ ఐ లవ్ యూ చెప్పి - నా వంతు వచ్చేటప్పటికి నీకేం తెగులు పుట్టింది - నా అందం నీకు అనలేదా ? అయితే నన్నెందుకు పెళ్లి చేసుకున్నట్లు ? అని సాధిస్తూ సాధిస్తూ ముగ్గురు పిల్లలను కన్నది . ఆ సాధింపు లు మాత్రం ఆపటం లేదు. "

" ఈ రోడ్డున పోతూ ఓవర్ హియరింగ్ చేసే వారికి నీ కధ క్రొత్త ఏమో కానీ మాకు పాతదే ను .ఇప్పటి విషయము ఏమిటో చెప్పు "

" ఇప్పటి విషయానికి వస్తే - అప్పుడు నేను ఐ లవ్ యూ చెప్పిన అమ్మాయిలు ఇప్పుడు సీనియర్ ఆంటీలు అయినారు . కానీ ఫేస్బుక్ లో నన్ను గుర్తు పట్టి నా పిక్ కు లైకు లు కొట్టి లవ్ సింబల్స్ పెట్టి ఫోన్ నెంబర్ అడుగుతున్నారు . ఒకరో ఇద్దరో అయితే ఎదో కాకతాళీయం అనుకుందును.కానీ ఆ మొత్తము యాభై మందీ లో ముప్పై మంది అడపా దడపా గా నా కాంటాక్టులోకి వచ్చేసారు అందులో చాల మంది ఇప్పుడు సింగిల్స్ . వారికి ఇన్నాళ్టికి నా మీద ప్రేమ మొలకలెత్తిందా ? లేక దీని వెనుక మా ఆవిడా అమృత హస్తము ఎమన్నా ఉన్నదా ? అని అనుమానము వస్తూవున్నాది . ఏ హస్తమూ లేదు అనుకుంటే నా ఈ 62 ఏండ్ల వయసులో నేను వారికీ తిరిగి " ఐ లవ్ యూ చెప్పి" ఏమి చేయ గలనా అనీ , చెప్పక పోతే వాళ్ళు నాలోని మొగమాహారాజు చచ్చి పోయినాడు అనుకుంటారో ఏమో అనీ - అనేక ఆలోచనలు నన్ను సుడిగుండంలో ముంచి తెలుస్తూ వున్నవి . ఏది ఏమైనా ఇప్పటికీ అందులో ఫదిమంది సూపర్ గా వున్నారు . కనీసం వారిలో నలుగురికైనా " ఐ టూ లవ్ యూ " అని చెప్పాలని గుండె ఉవ్విల్లూరుతోంది . ఆలా చెపితే నా రిటైరు మెంట్ ఎదో

హుషారుగా గడుస్తుందన్న ఆశ-   వున్నది. అది తోటకూర కాడలా పెరుగుతున్నది.  కానీ ఇది మా ఆవిడ హస్తమే అయివుంటే నా బతుకు బస్టాండ్లో బఠాణీలు అవుతుందే అనే భయంగా కూడా వుంది . ఏదన్నా చేయటానికి చేయక పోవటానికీ కూడా   గుండె నిబ్బరం    చాల కుండా వుంది . ఇప్పుడు నన్నేమీ చేయమన్నావు  మూర్తీ ?  అది చెప్పవూ ?" అని అడిగాడు .

అయన పేరు సుందర మూర్తి . నా పేరు రామమూర్తి. సాధూ సాధూ రాసుకుంటే బూడిద రాలింది అని చెప్పినట్లు గా  - మూర్తి మూర్తి రాసుకుంటూ ఏమి తేలుతుందో చెప్పలేము.

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ

4.అమ్మ నాకో డౌట్      29-01-25

వాళ్ల పిల్ల ఇంటికి వచ్చిందట . పెళ్లి అయి అత్తారింటికి పోయి ఆరు నెలల తరువాత ఇదే మరలా రావటం .

" ఏమన్నా విశేషము ఉన్నదా ?" అని తల్లి సంబరంగా అడిగింది
" అమ్మా నాకో డౌట్ వచ్చిందే " అన్నది ఆ అమ్మాయి .
" పిల్లలు ఎట్లపుడతారే ? అని గాని{అంటే ఏమి నోము నోస్తే అని గాని" } అట్లా అయితే కానీ పిల్లలు పుట్టారా? " {అంటే వరుసగా మూడు ఉపవాసాలు ఉంటే } అని గానీ తన కూతురు అడగ వచ్చును అని తల్లి ఊహించుకుంటూ వుంది . ఎందుకంటే పిల్లని ఆంత అమాయకత్వంతో పెంచింది కాబట్టి .
" ఎంటో చెప్పవే " అన్నది తల్లి .
" ఏంలేదమ్మా .. పెళ్లి అయినాక వేవిళ్లు అంటే వాంతులు వస్తావి కాదా ? దానితో పాటు విరోచనాలు కూడా వస్తే ఎట్లాగా అని ?  అని నాకేదో భయంగా వుంది . మా అయన నేను మాట్లాడుకుని  - వేవిళ్లు- విరోచనాలూ ఒక్కసారే

వచ్చే వీళ్ళు అనేకంగా ఉన్నాయని అనుకున్నాము . .అప్పటినుండి నాకేమో భయం వేసి అల్లా దూరంగా ఉంటున్నాము. "పిల్లలు అంటే భయపడుతూ వున్నాను . నువ్వేమంటావు అమ్మా ? "
"140 కోట్ల జనాభాను కన్నా తల్లులకు లేని డౌట్ నీకు వచ్చినందుకు ముందుగా నీ కాళ్ళు మొక్కాలి - ఈ ప్రశ్న తొలి సారిగా అడిగిన వనితగా నీకు గిన్నీస్ ఇప్పంచాలే . మొగుడొచ్చి మీద పెడతాడేమో అని మడి కట్టుకున్న వారు వున్నారు కానీ నీలాంటి ది లేదే అన్న ఆశ్చర్యాన్ని నేను దిగ మింకుకోవాలె . ఆ తరువాతనే నేను నీకు ఎమన్నా చెప్పాలె" అన్నది తల్లి .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ స్వంత కథ

**3.**మామా నన్ను మరీ మరీ పిలవకు 28 -01 -25

అయన గారు తన పిల్లను తన మేనల్లుడుకె ఇచ్చుకున్నాడు. మేనల్లుడే అల్లుడైతే పిల్ల ఇంటికి రానూ పోనూ ఎక్కువ స్వతంత్రగా ఉంటుందని . కానీ ఏ తత్ అల్లుడు మూడు సంవత్సరాల క్రింద వెళ్లిన సంక్రాంతికి మాత్రమే వచ్చాడు . మళ్ళీ రాలేదు . పిల్లను మాత్రమూ పంపుతూనే వున్నాడు . తన ఇంటికి రాని అల్లుని ఇంటికి వెళ్లి అక్కడ తన స్వతంత్రత ప్రకటించటం కష్టమని ఆయనకు తోచింది . అందువల్ల "పండుగకు రా అల్లుడూ "అని ఆయన ఈసంక్రాంతికి తన అల్లుడిని మరీ మరీ-- మళ్ళీ మళ్ళీ అడిగాడు .
అల్లుడు "నేను రాను మామా . మళ్ళీ మళ్ళీ ఇలా రమ్మనాకు " అని సగం మృదువుగా సగం కరువుగానూ బదులిచ్చాడు . " నువ్వెందుకు రావు - నేనేందుకు పిలవొద్దు ?" అని అయన ఉడుం పట్టు లా అడిగాడు .
అడిగాడు కాబట్టి ఇట్ల విన్నాడు " మామ - ఎవరన్నానిన్ను పిలిచి నీకో నమస్కారం పెట్టి - నీ కో పండూ ఓ తాంబూలము ఇద్దాము అనుకున్నారు అనుకో . దానితో పటు ఓ పంచేలా చాపు కూడా యుద్ధము అని కూడా అనుకున్నారు అనుకో . అప్పుడు నువ్వు మనసులో " ఈ పండ్లు పంచెలు నాకెందుకు ? నాకేమన్నా గతిలేదా ? ఏదన్న రొక్కం ఇవ్వరాదా ? - అదే నాకిష్టం " అనుకుంటావు .
తాంబూలం లో పెట్టి ఎదో కొంత పెద్దమొత్తము ఒప్పచెపుతాడు అని నమ్మకం కలిగించని వారింటికి నీవు పోవు . ఇచ్చే ఓపిక లేక పోయినవారి పిలుపులు దండగ

పిలుపులు,  అవి మనకెందుకు?  అని వారిని తప్పించుకు తిరుగుతావు .  ఇదేకదా నీ జీవన విధానము ? . మరి నీకొక న్యాయమూ ? నాకొక న్యాయ మూనా   ?

"నేను పండుగకు వచ్చినపుడు ఈ ఫాంట్లు షర్ట్స్   నాకెందుకు ? నాకేమన్నా గతిలేదా ? ఏదన్న రొక్కం అయితే బావుండేనూ   " అనుకుంటూ వుంటాను . నువ్వు ఇస్తావన్న నమ్మకంలేక మీ ఇంటికి రావటం  నేను తప్పించుకుంటూ ఉన్నాను   . నువ్వేదో ఒక లక్ష అయినా ఇస్తావు అని నమ్మకం కలిగితే కానీ నేను నీ ఇంటికి రాను . నీకు ఓపిక లేదంటే నీవి దండగమారి పిలుపులు అవి నాకెందుకు అనుకుంటాను . వాడిది అదొక జీవన విధానము అని  నీకు తోచినపుడు నేను వస్తాను . మేము సాఫ్ట్ వేర్ వాళ్ళము అంటే మాటలు కాదు.మాకూ ఎన్నో ఖర్చులు ఉంటవి  " అన్నాడు అల్లుడైన  మేనల్లుడు .

అతడు తనకు మామ యందు  తనకు వున్నా స్వాతంత్రము కొద్దీ అట్లా   పలికాడు అంతే  అని అనుకోవచ్చును.   లేదా మేనల్లుడే అల్లుడైనందున - ఎదో కుండ పగిలినట్లు ఇట్లా అయ్యింది అనికూడా చెప్పుకోవచ్చు ను

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

**2.**కాంతం మొగని కథ     27 -01 -25

"ఏమండీ ఏమి చేస్తున్నారు ?" అన్నది మూర్తి యొక్క భార్య . ఈ భార్యలు ఉన్నారే వారు ఎల్లప్పుడూ కూడా తమ భర్తలను వేయి కనురెప్పలవలె కనిపెట్టుతూ వుంటారు. ఈ రీజన్ వల్ల మూర్తి యొక్క భార్య ఇంట్లోనే ఎక్కడో వున్నది అని - వాకిట్లో ఎదో చేస్తూ ఉన్న భర్తను "ఏమిచేస్తున్నారు" అని అడుగుతూ వున్నది అనుకోవటానికి వీలు లేకుండా నూ వున్నది .

" ఏమి చేస్తున్నాను అంటే ? నిన్న ఆఫీస్ నుండి వచ్చేటపుడు నాలుగు వెదురు బొంగులు కొనుక్కుని సైకిల్ కి కట్టుకొని ఇంటికి తెచ్చి పడవేశాను . నిద్దరలేస్తూనే "ఏ- బీ- సీ- డీ " అని పేర్లు పెట్టి మూరలోతు గుంతలు నాలుగు తీసాను . ఆ వెదురు బొంగులను ఆ గుంతలలో పాతి వేసాను .ఏ నుండి బీకి

ఒక తాడు కట్టాను - దాని మీద ఒక చీర వేసాను . బీ నుండి సి కి మరొక తాడు కట్టి దాని మీద మరొక చీర వేసాను . మళ్ళా సి నుండి డీ కి మరొక తాడు కట్టి దానిమీద ఇంకో చీర వేసాను . చివరిగా డీ నుండి ఏ కి మల్ల ఒక తాడు కట్టాను . దాని మీద కూడా ఇంకో చీర వేసాను .చివరి చీర వేయగానే నువ్వు ఫోను చేసావు " అన్నాడు మూర్తి . మూర్తి కాంతం యొక్క మొగుడు. లెక్కల మాస్టారీ చేస్తాడు కధా ? . అందువల్ల చిన్నపిల్లకు చెప్పినట్లు చెప్పాడు .

" మీరు నా చీరల జోలికి ఎందుకు పోయినారండి ? నా పురిటికని పుట్టింటికి వచ్చేముందే -అన్నీ ఉతుక్కొని ఇస్త్రీ చేయించుకొని బొత్తర్లు పెట్టుకుని వచ్చాను, అవి ముట్టుకున్నారా ? మీకేం అవసరమొచ్చింది అంట ? అన్నది కాంతం .

" అవసరం అంటే ఏమి చెప్పనూ కాంతం ? నీవు పురుళ్ళకు పెడుతూ -- వస్తూ వున్నావు . నీ ఇంటి సేవలో నేను పడ్డాను . మాడిన గిన్నెలు , మురిగిన పాలు పెరుగు వాసనలతో ఇల్లు గుమ్మెక్కి పోతూ వున్నది - ఇక మాసిన బట్టలు సరే సరి . ఇవాళ ఆదివారం కదా అంట్లన్నీ తోముకుందామని అలోచించి ఓ మంచి ప్లాన్ వేసాను . ఆ ప్లాన్ ను బట్టి మన పెరట్లో - నీ చీరలతో ఏ బీ సి డీ ల మధ్య ఓ చీరల అంతఃపురం కట్టు కున్నాను . ఇప్పుడు నేను అందులో దూరి - నన్ను ఎవరూ చూడకుండా అంట్లు తోమి బట్టలు ఉతుక్కుంటాను "

" మధ్యలో నా చీరలను ఎందుకు తిప్పలు పెడుతున్నారండి ? మనఇంటికి నాలుగు వైపున నడుమెత్తు ప్రహరీ గోడలు వున్నవి కదా ? అన్నది కాంతము .

"వున్నవి సరే . ప్రహరీ గోడ వెనుక ఎవరన్నా స్త్రీ రత్నములు నిలబడి నన్ను లంబ కోణం లో చూస్తే నేను చక్కగా ఆవు పడతాను . ఆ కోణం

తప్పించుకోవటానికి నీ చీరల తో  అంతఃపురాణాన్ని కట్టుకున్నాను " అన్నాడు మూర్తి .

.  మూర్తి చేస్తున్నది అంతా నూ -- ఈపాటికే అనేక మంది అమ్మలక్కలు, విచిత్రంగానూ అయన కంటికి దొరక్కుండాను - ప్రహరీ గోడల వెనుక నిలబడి వీక్షిస్తూ నే వున్నారు . మూర్తి చీరల మధ్యకుదూరంగానే వారు నిర్భయంగా పెరటిగోడ మీద మోచేయి ఆనించి ఆ చేతిని చెక్కిళ్ళకు  లేదా గడ్డాలకు చేర్చుకొని - చీరల మధ్య ఏమి జరుగుతుందో చూడ సాగారు .

మూర్తి గారు అనగా కాంతం గారి మొగుడు కధా ? అతను -ఆ అంటేనూ  వూ అంటే నూ  ఇలాగె చేస్తాడు . ఎదో నాలుగు గిన్నెలు తోమేసుకోని ఇంట్లో కెళ్ళి పడే బదులు -  అంతా విచిత్రం చేస్తాడు. ఫది మంది మధ్య "అయ్యో కాంతం మొగుడు " అనిపించుకుంటూ ఉంటాడు .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ

**1.**సత్పురుషుల  **-** స్వయం పాకం డే లు .  25-01-24

--- అనగా అనగా ఒక సారి  సత్పురుషులైన మొగవారు కొందరు- ఎవరికో చెప్పగా - ఆ ఎవరో విన్న సంగతి ఏమిటంటే ?  .  ఏ సత్పురుషుడై న సంసారి అయితే  - సంవత్సరానికొక వారం పాటు  తన  వంట తానే  వండుకొని తన  గిన్నీ తానే తోముకుంటూ నలభై నుండి  అరవై ఏండ్ల వరకూ  గడుపుతాడో వానికి  కోటి యజ్ఞములు   చేసిన ఫలితం దక్కుతుంది అనీ  -  ఆ ఫలితం పుణ్యాన  -  వారు తమ  ఇంటి ఇల్లాలిని భేఖాతర్ చేసి - తమ  స్వశరీరంతో ,  స్వర్గ నివాసి ఐన రంభ వద్దకు పోతూ  - రాతూ  ఉండవచ్చు అనీ .

.   ఈవ్రత  విధాన మహిమ ఏమిటో  చూద్దామనుకున్న నేను నా 40 వ   ఏట "సత్పురుషుల  - స్వయం పాకం డే లు" ఆచరించ మొదలెట్టాను .
అన్నమూ చిక్కుడు కాయ కూర స్వయంగా  వండుకొని  మొదటి సత్పురుషుల  - స్వయం పాకం డే  ని జరుపుకోవాలని  నిర్ణయించు కున్నాను. బియ్యము ఎట్లాగో కడగాలి కదా ? అందుకని కొన్ని బియ్యము ఓ గిన్నెలో పోసి అందులో నీరు పోసాను . కూరకు కావాల్సిన చిక్కుడు కాయలు కూడా కడుక్కోవాలి కదా ? ఇందుకోసం వేరే ఇంకో గిన్నె ఎందుకు దండుగ?అదికూడా నేనే కడగాలి కదా ? అని అలోచించి ఆ చిక్కుడు కాయలు కూడా అదే  బియ్యపు గిన్నెలోనే వేసి పిసిసికి కడిగేసాను . ఏద్దైనా కాస్త నానితే కొంత తేలిక గా  ఉడుకుతుంది గదా ? అని - వాటిని అట్లాగే ఓ గంట నాన పెట్టాను . అప్పుడు  నానిన బియ్యం లోనుండి చిక్కుడు కాయలను బయటికి తీసి వాటిని కూర వండాను .బియ్యాన్ని అన్నం వండాను .

వండిన కూర రుచి  చూస్తే - కమ్మని అన్నం లా  బ్రహ్మాండంగా వుంది . ఇక అన్నం రుచి చూస్తే  చిక్కుడు కాయల కూర రుచితో మహా  బ్రహ్మాండంగా వుంది . కంచంలోకి  వడ్డించుకొని రొండూ  కలిపి తింటూ  ఉంటే ఏంటో దరిద్రంగా వుంది . చివరికి నేను ఒక వారం రోజుల పాటు  ఒత్తి అన్నమో ఒత్తి కూర యో మాత్రమో తినవలసి వచ్చింది .

'వాళ్ళు  చేయని వంట ఎల్లా ఉంటుందో తెలుసుకో ' అని చెప్పి వారి ఆధిక్యత రుజువు పరచటానికనే -ఆ సత్పురుషులు -  ఈ "సత్పురుషుల  - స్వయం పాకం డే లు" పెట్టారేమోననని  నేను డౌట్ పడ్డాను .

నిజానికి పోతే సత్పురుషులకు రంభ  లతో ఏమి పని వుంది ?వారికీ వారి భార్యలే ఎక్కువ . వారికి రంభ అయినా,  దాని అంబ అయినా అంతా ఒక్కటే కదా ? "కాదు సామీ -  మీ యజ్ఞము ఫలిస్తుంది అనటానికి ఆ రుచుల మార్పే ప్రబల సాక్ష్యం ఏమో ?" ఆని మరొకరు   అన్నారు .
వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ

**0–** అది మరీ పెద్దఖర్చు కాదు   **24-01-25**

మా ఆవిడ ఎదో ఫోను కాల్ మాట్లాడి " పదండి మా అక్క వాళ్ళింటికి పోయి వద్దాము " అన్నది . అంటూనే తయారైపోయింది . ఇంత క్విక్ అంటే ఏంటో కొంప మునిగిందా ?అని నేను అదిరి చచ్చాను .

అక్క ఎదురువచ్చి - చెల్లిని సాదరంగా లోనికి తీసుకుపోయింది . నేను వాళ్ళిద్దరి హావ భావాలను గమనిస్తూ వినోదించటానికి వీలున్న చోట - దొరికిన కుర్చీలో కూచున్నాను . అప్పా చెల్లెనులు ఇద్దారూ ఒకరి మొఖాలు ఒకరి ఒకరు ఆప్యాయంగా పరికించుకొని ఒకరి తల జుట్టును ఒకరు నిమిరుకున్నారు , "కొత్తి మీరా కట్టను - ఎండు గోంగూర కట్ట పలకరించినట్లు ఉందని నేను నవ్వునుకున్నాను . అప్పటికి ఎంతో కొంత సమయం తరువాత అక్క చెలేండ్లు ఇద్దారూ జుట్లు విడిపించుకొని కిచెన్లోకి వెళ్లి నాకు కాఫీ తయారు చేశారు .

మా ఆవిడ ఎంతో సంబరం కన పరుస్తూ " ఏమండీ అక్క జుట్టు కొంచెము ఒత్తుగా ను కొంచెము పొడుగునూ పెరిగింది కాదూ ?" అని అడిగింది . నేను జంకుతూ జంకుతూ " వదినగారంటే తల్లి లాంటి ది అన్న దృష్టితో చూడవలె అని మర్చి పోయావా? "అని అడిగాను .

ఆవిడ కంగుతిని - పళ్ళు బిగపట్టుకొని " పోనీ నా జుట్టు ఎలాఉండే ?అది చెప్పండి ? " అన్నది .

"నీ తల కట్టు అమోఘము . ఏపుగా ఎదిగిన కొత్తిమీర కట్టనే అనుకో " అని నేను నోరు పారేసాను .

" అలాగే అనుకోండి . కానీ ఇలాంటి దానితో తిరగాలంటే మీకు సిగ్గుగా లేదూ ?" అని ఆమె నన్ను నిల దీసింది .

" వున్నది కానీ అది కాదనటం ఎట్లాగో ఆలోచన కాకుండా వుంది "

" మీకు నా జుట్టు గురించి ఎడతెగని ఆలోచనలు వుండే ఉంటావని - కానీ ఏమీ చేయాలో మీకు పాలు పోకుండా వుండే నని - అక్క అన్నది . పెరిగిన తన జుట్టు సాక్షిగా మనకో ఉపాయం కూడా చెప్పింది . రేపు ఎలాగో ఆదివారము కాబట్టి

మనము "నాగప్పా దిప్ప " అనే పునీక్షేత్రం వెళ్ళుదాము . మీ కోరికి తీరి నాకు నాగు పాము అంత జుట్టు వస్తుంది "

"అది ఇక్కడికి 300 కిలోమీ వుంది. అక్కడికెడితే నీకు జుట్టు ఎలా పెరుగుతుంది ? ముందు ఈ సందేహం తీర్చు . అప్పుడు ఆలోచిద్దాము"

"నాగప్పా దిప్ప "లో ఓ నాగుపాము పుట్టమీద ఓ వందేళ్ల నాటి కొబ్బరి చెట్టు వున్నదిట .దాని తల నాగు పడగలా ఉంటుందిట . ఆ నాగ కొబ్బరి చెట్టు రాల్చిన బోండాలను వెయ్యి నూట పదహారులకు ఒకటి అమ్ముతూ వున్నా కానీ కొనే వారి క్యూలైను కి అంతే లేదుట .ఎంత క్యూ ఉంటే అక్కడ అంత మహిమ వున్నది అనే కదా ? అర్థము ? ఆకాయను కొని ఆ నాగుల పుట్టకు కోట్టి - కొట్టిన అరగంటలోనే ఆ కొబ్బరిని రుబ్బించి - కొబ్బరి పాలు తయారు చేయించుకొని - ఆ పాలను అక్కడే వున్నా నలుగురు ముత్తైదువులకు - ఆరుగురు కన్నె పిల్లల తలలకి రాసి - ఆ చేతులతో మన తలను తడుపుకుంటే జుట్టు నల్లగా ఒత్తుగా పొడుగ్గా పెరుగుతుంది టండీ - మా అక్క తాను పోయొచ్చి - తన జుట్టు పెరిగింది అని నాకు నమ్మకం కుదిర్చి నాక నాకు చెప్పింది . మనం కూడా నమ్మకంతో వెడదామండీ " అని ఆమె అన్నది .

నిన్న అర్ధరాత్రి వరకూ మా ఇద్దరిమధ్యా ఇదే సంభాషణ జరిగి - ఆడ వారి జుట్టు పోషణ ముందు ఎంత ఖర్చు అయినా అది వృధా కిందకు రాదు అని నాకు నమ్మకం కుదిరే దాకా ఆమె వాదించటం వల్ల - మాకారు కోసం ఒక డ్రైవర్ ను ఏర్పాటు చేసుకొని "నాగప్పా దిప్ప "కు బయలు దేరాము . అతడు వచ్చి " మా ఆడది కూడా జుట్టు కోసం అని "నాగప్పా దిప్ప " వేడుదాము అని ఎప్పటినుండో అనుకుంటున్నదిట . దారిలో ఆమెను కూడా పిక్కుప్ చేసుకు వెడదాము . ఆమె మేడం గారికి తోడుగా ఉంటది . నేను డ్రైవర్ బేటా లేకుండా కారు తొలుతా" అన్నాడు .

సరే అలాగే వెళ్ళాము .మొదట "నాగప్పా దిప్ప "లో నాగుల పుట్ట మీద వున్నా కొబ్బరి చెట్టుకు కాసిన కొబ్బరి కాయను 1116 కు కొన్నాము . ఈ దిప్పగురించి

ఏమిటంటేఈ దిప్ప మీదఎప్పుడైనా సరే 330  మందికంటే ఎక్కువ నుంచుంటే ఆ భారానికి ఆ దిప్ప పాతాళంలోకి కుంగి పోతూ వుంటుందట . అందువల్ల లోపలికెళ్ళి బయటకి వచ్చిన వారిని లెక్కా చూసి  అందుకు తగ్గట్లు ఎంట్రీ టికెట్స్ ఇస్తారు . మూడు గంటల అనంతరం మాకు ఎంట్రీ దొరిగింది .

మేము కొట్టిన కొబ్బరి కాయను ముక్కలు తీసి -   పొత్రాన్ని  శుభ్రంగా కడిగి - మా ముక్కలను  రోట్లో వేసి పాల లాగా మర్చి ఇచ్చిన స్త్రీ తనకి   200  అంటే ఇచ్చాము . ఆ పాలు ముత్తైదువల జుట్టుకు పూయటానికి ముందు నాగుల పుట్ట పూజారి గారి అట్టలు కట్టిన జుట్టుకు పూయాలి అన్నారు . ఇందునకు   ఆయనకు 516   ఇచ్చాము . 4 ముత్తైదువులు - 6 మంది కన్నె పిల్లలు ఒక్కో గ్రూప్ గా అక్కడి చెట్ల కింద పీటలు వేసుకొని కూర్చొని వున్నారు . ఆ కన్నె పిల్లల జుట్లు చూస్తే గుండెల్లో గంటలు మోగాయి . వీరి అందరికీ కలిపి 1116  అన్నారు . అవీ ఇచ్చాము . అన్నీ చేసి ఇంటికి వచ్చి చేరాము .

"నా  జుట్టు ఆ కన్నె పిల్లల జుట్టు లా నల్లగా లావుగా ఒత్తుగా పెరిగి  - మీ  గుడిలో గంటలు మోగితే - దాని ముందు ఇది ఏ పాటి ఖర్చు అవుతుందో చెప్పండి ? అని న భార్య నన్ను ఊకో పెట్టింది .  వాళ్ళ   జుట్లు నిజం కాదేమో ? - వారిలాగా నీవు కూడా విగ్గులే వాడు" అని నేను అన్నాను .

ఈ కథలోని నీతి  ఏమిటి అంటే " ఆడవారి జుట్టు పోషణముందు ఏ ఖర్చూ పెద్ద ఖర్చు కాదు .  "జుట్టు పెరగటం , పెరగకపోవడం దాని సొంత ఇష్టానికి లోబడి " అనే కండిషన్ వర్తిస్తుంది .

వారణాసి ఉమా   శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి స్వంత కథ



**Fb All reactions:more than 150**

**Bhavanikumari Bellamkonda**

మీరు గమ్మత్తైన టాపిక్స్ ఎంచుకొని అద్భుతంగా హాస్యం పండిస్తారండి పిచ్చి పిచ్చి మూఢ నమ్మకాలతో ఎంత సొమ్ము నాశనం చేసుకుంటున్నారు బలే సెటైరికల్ గా చెప్పారు

